# <u>పంచాంగ గణితము</u>

(సంక్షిప్త్ నారద విష్ణు పురాణ్ ఆంక్ (హిందీ) జనవరి 1954, పేజి 227 ఆధారంగా )

(భాషాంతరీకరణము మరియు సంకలనం : డి.నారాయణరావు, విద్యానగర్, హైదరాబాదు)

## 1. **నక్షత్ర సాధన**

ఒక్కొక్క నక్షత్ర పరిమాణము 800 కలలు (60 కలలు = 1 అంశ లేదా డిగ్రీ ). స్పష్ట చంద్ర గతిని కలలుగా మార్చుకొని, 800 లచే ఆ సంఖ్యను భాగించగా వచ్చిన భాగఫలము గత నక్షత్రము. శేషము నక్షత్ర భుక్తి. 800 లలో శేషమును తీసివేయగా మిగిలినది నక్షత్ర భోగ్యము. నక్షత్ర భోగ్య కలలను 60 చే గుణించి చంద్ర చలనము (గతి) చే భాగించగా వచ్చు భాగఫలము, ఉదయమునుండి ఆ నక్షత్ర భోగ్యము ఘడియలు, విఘడియలలో వచ్చును.

ఉదాహరణము:- చంద్ర చలనము (గతి) 819. స్పష్ట చలనము 2-10-15-25 అనగా 4215-25 కలలు. 800 చే భాగించగా 5 భాగ ఫలము. 5 అనగా అశ్విన్యాదిగా మృగశిర నక్షత్రము భుక్తి. శేషము 215-25 కలలు. ఇది ఆర్ద్రా నక్షత్ర భుక్తి. 800-215-25=584.35. ఇది ఆర్ద్రా భోగ్యం. చంద్ర చలనము 819 కలలకు 60 ఘడియలైన, 584-35 కలల చలనమునకు ఎన్ని ఘడియలగును అను విషయమును త్రైరాశిక  పద్ధతి ద్వారా సాధించగా 42 ఘడియల, 49 విఘడియలు. ఇది ఉదయాదిగా ఆర్ద్రా నక్షత్ర భోగ్యం.

## 2. **యోగ సాధన**

ప్రాతఃకాల స్పష్ట సూర్య, చంద్రుల చలనముల మొత్తమును కలలుగా మార్చుకొని, 800 చే భాగించగా వచ్చిన భాగఫలము గత యోగము (విష్కంభము ఆదిగా). శేషము ప్రస్తుత యోగముయొక్క భుక్తి. దీనిని నుండి తీసివేయగా ప్రస్తుత యోగపు భోగ్యకాలము. దీనిని 60 చే గుణించి, సూర్య చంద్రుల దిన గతుల మొత్తము కలలచే భాగించగా, ఉదయాదిగా ప్రస్తుత యోగపు భోగ్య ఘడియలు వచ్చును.

ఉదాహరణము:-స్పష్ట సూర్య చంద్రుల మొత్తము 7-29-57-40. అనగా 14397-40 కలలు. 800 చే భాగించగా 17 భాగఫలము. అనగా వ్యతీపాత యోగము భుక్తి. 797-40 శేషము. ఇది వరీయాన్ యోగ భుక్తి. 800-797-40=2-20 ఇది వరీయాన్ భోగ్యము. 797-40 మరియు 2-20 వీటిని విడివిడిగా 60 చే గుణించి, సూర్య చంద్ర దిన చలనములు (57-36 మరియు 819-00=876-36 చే భాగించగా 54 ఘడియల 35 విఘడియల భుక్తి మరియు 9 విఘడియల భోగ్యకాలము వచ్చినది.

### 3.**తిథి సాధన**

స్పష్ట చంద్రుడి భాగల నుండి స్పష్ట సూర్యుడి భాగలను తీసివేసి, కలలలోనికి మార్చుకొని, దానిని 720 చే భాగించగా వచ్చు భాగఫలము గత తిథి. ఒక్కొక్క తిథి ప్రమాణము 720 కలలు లేదా 12 డిగ్రీలు. శేషము ప్రస్తుత తిథి యొక్క భుక్తి. శేషమును 720 నుండి తీసివేయగా ప్రస్తుత తిథి భోగ్యము వచ్చును. వీటిని 60 చే గుణించి సూర్య చంద్రుల గతుల భేదములచే భాగించగా ఉదయాదిగా తిథి భోగ్య (శేష) ఘడియలు వచ్చును.

ఉదాహరణము:-ప్రాత స్పష్ట చంద్రుడు 6-24-15-03, ప్రాత స్పష్ట సూర్యుడు 1-5-42-37, చంద్ర గతి 819-00, సూర్య గతి 57-36. చంద్రుడి భాగలు (6-24-15-03) నుండి సూర్యుడి భాగలు (1-5-42-37) తీసివేయగా 5-18-32-26 అనగా 10112-26 కలలు. దీనిని 720 చే భాగించగా 14 భాగఫలము. అనగా శుద్ధ చతుర్దశి భుక్తి. శేషము 0-32-26. ఇది పూర్ణిమా భుక్తి. 720 నుండి 32-26 తీసివేయగా 687-34. ఇది పూర్ణిమా భోగ్యం. భుక్తి 32-26 ను 60 చే గుణించి, చంద్ర సూర్యుల గతి భేద కలలచే (761-24 చే) భాగించగా 54 ఘడియల 12 విఘడియలు ఉదయాదిగా పూర్ణిమా శేష కాలము వచ్చును.

### 4. **కరణ సాధన**

చర కరణములు- 1.బవ, 2.బాలవ, 3.కౌలవ, 4.తైతిల, 5.గరజి, 6.వణిజ, 7.విష్టి (భద్ర). ఇవి శుక్ల ప్రతిపద ఉత్తరార్థము మొదలుకొని బహుళ చతుర్దశి పూర్వార్ధము వరకు (28 తిథులలో) 8 ఆవృత్తులుగా (సార్లుగా) వచ్చును. బహుళ చతుర్దశి ఉత్తరార్ధము నుండి శుక్ల ప్రతిపద పూర్వార్ధము వరకు వరుసగా 1.శకుని, 2.నాగము, 3.చతుష్పదము, 4.కింస్తుఘ్నము అను నాలుగు కరణములు వచ్చును. ఇవి మారకుండా ఇవే తిథులలో వస్తాయి కాబట్టి వీటిని స్థిర కరణములు అంటారు. శుక్ల పక్ష ప్రతిపదాదిగా గత తిథి సంఖ్యను 2 చే గుణించి, 7 చే భాగించగా వచ్చు శేషము క్రమముగా బవాదిగా కరణము అగును. ఆ కరణము ప్రస్తుత తిథి పూర్వార్ధమునందుండును.

ఉదాహరణము:- శుక్ల పక్ష ద్వాదశి కరణములు. గత తిథి సంఖ్య 11 ను 2 చే గుణించి 7 చే భాగించగా -11x2=22/7=శేషము 1. అనగా ద్వాదశి పూర్వార్ధము బవ కరణము. ఉత్తరార్ధము బాలవ కరణము. కృష్ణ పక్ష తిథులకు 15 కలిపి చేయవలెను. బహుళ ద్వాదశి.-గత తిథి 11+15=26x2=52/7=శేషము 3. అనగా బహుళ ద్వాదశి పూర్వార్ధము కౌలవ కరణము. ఉత్తరార్ధము తైతిల కరణము.

### 5.**గ్రహణ సాధన**

పర్వము-చంద్ర గ్రహణము నందు పూర్ణిమ, సూర్య గ్రహణము నందు అమావాస్య. పర్వాంత కాలము నందు స్పష్ట సూర్యుడు, స్పష్ట చంద్రుడు మరియు స్పష్ట రాహువులను సాధించవలెను. స్పష్ట సూర్య భాగలలో స్పష్ట రాహు భాగలను తీసివేయగా మిగిలిన శేషము దాని భుజాంశ లేదా 14 కన్న తక్కువగా నున్నచో అది చంద్ర గ్రహణమగును. ఆ భుజాంశలను 11 చే గుణించి, 7 చే భాగించగా వచ్చునది "శరము" అగును. సూర్యగ్రహణములో సూర్యుడు ఛాద్యుడు. చంద్రుడు ఛాదకుడు. చంద్రగ్రహణములో చంద్రుడు ఛాద్యుడు. భూభా ఛాదకము (గ్రహణకర్త్రీ). ఛాద్య, ఛాదకుల బింబ మానములు మొత్తములో సగములో "శరము" తీసివేయగా "ఛన్న(గ్రాస)" మానము వచ్చును. గ్రాస మానం గ్రాహ్యం (ఛాద్యం) కన్న ఎక్కువైన, అందు ఛాద్యం తీసివేయగా వచ్చిన శేషము ఖఛ్ఛన్న(ఖగ్రాస) మగును.

ఉదాహరణము;-పూర్ణిమాంతం ఘ.40, వి.ఘ.48, స్పష్ట సూర్యుడు 8-0-12-06, స్పష్ట చంద్రుడు 2-0-12-01, స్పష్ట రాహు 7-28-23-18, సూర్యుడి నుండి రాహు తీసివేయగా 0-1-48-48 వ్యగు. ఇది 3 రాశుల కన్న తక్కువ. కనుక దీని భుజాంశము ఇదియే.1-48-48. ఇది 14 డిగ్రీల కన్న తక్కువ. అందువల్ల గ్రహణము నిశ్చయము. వ్యగు భుజాంశ 1-48-48 ను 11 చే గుణించి, 7 చే భాగించగా 2-50 శరము. ఇది వ్యగు యొక్క ఉత్తర దిశయందున్న వలన ఉత్తర దిశయందు వచ్చినది.

సూర్యగతిని 2 చే గుణించి 11 చే భాగించగా వచ్చునది సూర్యబింబమానము, చంద్రగతిని 74 చే భాగించగా వచ్చునది చంద్రబింబ మానము. చంద్రగతిలో 716 తీసివేసి శేషమును 22 చే భాగించగా వచ్చిన లబ్దమునకు 32 కలిపి, అందులో సూర్యగతిలో 7 వ భాగం తీసివేయగా భూమి నీడ (భూభా) వచ్చును.

భూమి సూర్యుని చుట్టు ఒక సారి తిరగడానికి పట్టే కాలం 365 రోజుల, 5 గంటల, 48 నిమిషముల 47.5 సెకండ్లు. 4 సంవత్సరాలకు ఆ భేదం 23 గంటల, 15 నిమిషముల, 10 సెకండ్లు. లీపు సంవత్సరం వల్ల ఆ భేదం 24 గా పెరుగుతుంది. అంటే 44 నిమిషముల 50 సెకండ్లు. ఈ భేదాన్ని 3 రోజులకు పెంచుతారు. ప్రతి 400 సంవత్సరాలకు ఈ భేదం 3 రోజులకు చేరుతుంది. 400 సంవత్సరాలకు 100 లీపు సంవత్సరాలకు బదులు 97 లీపు సంవత్సరాలే ఉంటాయి. ప్రతి శతాబ్ది సంఖ్య 400 చే భాగించ బడితేనే అది లీపు సంవత్సరం.

ఉదాహరణకు 1900 లీపు సంవత్సరం కాదు. కాని, 2000 లీపు సంవత్సరం.

## యుగాదులు (యుగ ప్రారంభ తిథులు)

1. కార్తీక శుక్ల నవమి - సత్య యుగాది (సత్య యుగ ప్రారంభ దినము)

2. వైశాఖ శుక్ల తృతీయ - త్రేతాయుగాది (త్రేతాయుగ ప్రారంభ దినము)

3. మాఘ బహుళ అమావాస్య - ద్వాపరయుగాది (ద్వాపరయుగ ప్రారంభ దినము)

4. భాద్రపద బహుళ త్రయోదశి - కలియుగాది (కలియుగ ప్రారంభ దినములు)

ఇవి అతి పుణ్య తిథులు

**మన్వాది తిథులు (మన్వంతరం ప్రారంభమైన తిథులు)**

1. కార్తీక శుక్ల ద్వాదశి
2. ఆశ్వయుజ శుక్ల నవమి
3. చైత్ర శుక్ల తృతీయ
4. భాద్రపద శుక్ల తృతీయ
5. పౌష్య శుక్ల ఏకాదశి
6. ఆషాఢ శుక్ల దశమి
7. మాఘ శుక్ల సప్తమి
8. భాద్రపద బహుళ అష్టమి
9. శ్రావణ బహుళ అమావాస్య
10. ఫాల్గుణ శుక్ల పౌర్ణమి
11. ఆషాఢ శుక్ల పౌర్ణమి
12. కార్తీక శుక్ల పౌర్ణమి
13. జ్యేష్ట శుక్ల పౌర్ణమి
14. చైత్ర శుక్ల పౌర్ణమి

పితృ కర్మలకు (పార్వణ శ్రాద్ధాలకు) ఈ తిథులు అత్యంత పుణ్య ప్రదములు